# KENOPANISHAD

*(In Telugu Verse)*

TRANSLATED BY

**Andipudi Somanatha Row,**

TELUGU PANDIT

SREE RAJAH RAVU CHALLAYYAMMA RAVU

**High School, Pittapur.**



# కేనోపనిషత్తు.

ఆంధ్ర పద్య కావ్యము. B. A. B. A.

పిఠాపురములోని శ్రీరాజా రావు చెల్లాయమ్మా

రావు హైస్కూలు తెనుగుపండితులగు

ఆదిపూడి సోమనాథరాయునిచే

రచియింపఁబడినది.



మొదటికూర్పు 300 ప్రతులు.

Printed at the DHARMA SADHANI PRESS,
and published by D. V. SURYAPRAKASA
ROW, B. A., COCANADA.

PRICE 0-1-6. }
Including Postage. } [వెల పోస్టేజితో రు 0-1-6.

# పీఠిక

ఇంతవరకు నా కోరిక పైన ఈశావాస్యోపనిషత్తును మ॥ రా॥ శ్రీ పాలెపు వెంకట సూర్యగోపాలము పంతులుగారును, కఠోపనిషత్తును మ॥ రా॥ శృంగారకవి సర్వారాయుడు పంతులుగారును తెనుగున పద్యకావ్యములుగ రచించిరి. ఇప్పు డాదిపూడి సోమనాథరావుగారు కేనోపనిషత్తును పద్యకావ్యముగ రచించిరి. ప్రస్తుత మాంధ్రదేశమున గల సుప్రసిద్ధాంధ్ర కవులలో నాయన యొకరు.

ఉపనిషత్తునకు మొదట నున్న కేన శబ్దమును బట్టి యీ యుపనిషత్తున కీ నామము వచ్చినది. తలవకారశాఖ కీ యుపనిషత్తు చెందియుండుట వలన దీనికి తలవకారోపనిషత్తను నామాంతరము కలదు. ఒక బ్రాహ్మణము యొక్క తొమ్మిదవ యధ్యాయ మీ యుపనిషత్తనియు, విరక్తుడగు వానికి బ్రహ్మవిచారము నిది ప్రశ్నోత్తర రూపమున దెల్పుచున్నదనియు శంకర భాష్యమం దుదాహరింపబడి యున్నది. మొదటి యొని

మిది శుధ్యాయమునందు హోమాదులు, ప్రాణో పాసన విధానము తెలుపబడినవి దీనితో బ్రహ్మవిచార మారంభ మగును.

దారాషుకో కేనోపనిషత్తును పారసీక భాషయందు వ్రాయించెను. అంక్వెటిలు డూపెరాన్ ఫ్రెంచి భాషయందును, రాజా రామమోహన రాయలు మాక్సుముల్లరు లింగ్లీషునను, పోలీ డొయిసనలగు వారు జర్మను భాషయందును దీనిని వ్రాసియున్నారు.

కాకినాడ.
౨౦-౭-౩౧

దుగ్గిరాల సూర్యప్రకాశ రావు.

ఓమ్.

# కేనోపనిషత్తు.

—:o:—

## ప్రథమ ఖండము.

గీ. ప్రాణమానసములఁ దమ పనులయందు
వీనుగన్నులఁ దమతమ విషయములందు
వాక్కు నెంతయు దాని వ్యాపారమునను
వింతగాఁ గొల్పుచుండెడు వేలు పెవఁడు. ౧

గీ. అనుచు జిజ్ఞాసువగు శిష్యుఁ డడుగఁ గాన
యతని యాసక్తి కెంతయు నాత్మ మెచ్చి
చక్కఁగా బోధపడునట్టి చందమునను
బ్రహ్మవిదుఁడగు ఋషి యిట్లు పలుకఁ దొడఁగె.

గీ. కంటికిం గన్ను కర్ణంపుఁ గర్ణ మనుచు
వాక్కునకు వాక్కు ప్రాణంపుఁ బ్రాణ మనుచు
మనమునకుఁ గూడ బ్రహ్మమే మన నటంచుఁ

జేట కెల్లంబుగాను సద్గురు తెలిపఁగి
యమృతులై యుందు రిహలోక యాత్ర వీడి ౩

గీ. కనులు వాక్కును గాని యా మనసు గాని
కనఁగొనఁగ లేని బ్రహ్మము గాంచు టెట్లు
దివ్యబ్రహ్మ స్వభావము దెలియ కుండఁ
దెల్లముగ శిష్యకోటికిఁ దెలుపు టెట్లు? ౪

గీ. కానఁబడు జగతి కంటెను గానరాని
కారణము కంటెఁ గూడను వేరుగాను
వెలయు నా బ్రహ్మమని తొంటి పెద్దలెల్లఁ
బలుకు చుండఁగ వినియున్న వారము గద. ౫

గీ. వాక్కు లెద్దానిఁ దెలుపంగ వలను పడదొ
వాక్కు లెద్దాని చేతను బ్రకటితములొ
యదియె బ్రహ్మము తదితర మైనయట్టి
దేదియును గూడ బ్రహ్మము గాదు వత్స.

గీ. మనము మనకు దేనిఁ దెలియంగ సమర్థ కాదొ
దేనిచే సర్వము మదిఁ దెలియఁ గలదొ.

యదియె బ్రహ్మమ్మ తదితర మైన యట్టి
దేదియును గూడ బ్రహ్మమ్ము గాదు వత్స. ౭

గీ. కనులు దేని స్వరూపము గానలేవొ
కన్ను లెద్దానిచేతను గాంచ గలవొ
యదియె బ్రహ్మమ్మ తదితర మైన యట్టి
దేదియును గూడ బ్రహ్మమ్ము గాదు వత్స. ౮

గీ వీను లెద్దాని వినుటకు వీలుగాదొ
వీనులెద్దాని చేతను విన గలుగునొ
యదియె బ్రహ్మమ్మ తదితర మైన యట్టి
దేదియును గూడ బ్రహ్మమ్ము గాదు వత్స. ౯

గీ తెలియ ప్రాణమ్మ దేని కాదరువు కాదొ
ప్రాణ మెద్దానిచేతను ప్రాణ మగునొ
యదియె బ్రహ్మమ్మ తదితర మైన యట్టి
దేదియును గూడ బ్రహ్మమ్ము గాదు వత్స. ౧౦

ఇది ప్రథమ ఖండము.

సమాప్తము.

ఓమ్.

# కేనోపనిషత్తు.

—:o:—

## ద్వితీయ ఖండము.

గీ. బ్రహ్మమును గంటి నంచు దేవతలయందు
ననుచుఁ జెప్పుట యొక గొప్ప యగు నని వత్స
యనుచుఁ బలికెను గురుని వాక్యార్థ మెల్ల
నేకతంబుగఁ జింతించి యెఱుఁగు వాఁడ
బ్రహ్మము నెఱింగితి నటంచుఁ బలుకఁ గలఁడు. ౧

గీ. ఏను బ్రహ్మమ్ము నెఱిఁగియు నెఱుఁగ ననుము
ననెడు గురువర్య వాక్యార్థమును నెఱుంగు
బ్రహ్మచారికి నిజముగా భవ్యమైన
విమల బ్రహ్మ స్వరూపమ్ము వేద్య మగును. ౨

గీ. తెలియ దని బ్రహ్మవేత్త దాఁ బలుకుచుండు
పలుకు లెంతయు సత్యమె వఱలుచుండుఁ

తెలియ దను వాఁడె బ్రహ్మమ్ముఁ దెలియుచుండుఁ
దెలియు నను వాఁడె బ్రహ్మమ్ముఁ దెలియకుండు.

గీ. బ్రహ్మమును నాత్మలోఁ జూచు బ్రహ్మవేత్త
యక్షయం బగు మోక్షంబు ననుభవించు
బ్రహ్మ సంబంధమైన నాత్మ బలముఁ గాంచు
నాత్మ విజ్ఞానమున మోక్ష మనుభవించు. ౪

గీ. ఇచట నాత్మ స్వరూపమ్ము నెఱుఁగఁ డేని
సత్యముగ నాశ మొందు సంశయము లేదు
గాన భూతంబులం దెల్లఁ గ్రాలుచుండు
నద్వితీయమైన బ్రహ్మమ్ము నాత్మఁ గాంచి
ధీరు లిహలోక యాత్రను దీర్చి యవల
మోక్ష సామ్రాజ్య పదవిని బొందఁ గలరు. ౫

ఇది ద్వితీయ ఖండము.

సమాప్తము.



౨. ఖ.

# కేనోపనిషత్తు.

## తృతీయ ఖండము.

గీ. ఆ పరబ్రహ్మ మహిమచే నమరు లెల్ల
నసురతతుల జయించి మహాహవమున
నా పరబ్రహ్మ మహిమను నాత్మ మఱచి
కాంచిన జయంబు తమదని గర్వించిరి. ౧

గీ. అంతయు నెఱింగి బ్రహ్మ మా యమరులకున
దగిన మాలిన గర్వముల్ దొలఁగఁ జేఁయ
యక్షముగఁ బొడగట్టిన నట్టి చూచి
నేదియో భూత మిది యని యెంచి సురలు. ౨

గీ. పూజ్యమై యొప్పుచుండు నీ భూత మెవరొ
యరసి రమ్మని పంపిరి యగ్నిహోత్రు
వడిగఁ బరుగెత్తు కొని వచ్చు వహ్నిఁ జూచి
యక్ష మెలుఁగెత్తి నీ వెవ్వఁ డనుచు నడిగె. ౩

గీ. జాతవేదాఖ్యచేత విఖ్యాతుఁ డైన
యగ్ని నేఁ బని గర్వించి యనలుఁ డనియె
నయిన నీ బల మెంతని యక్ష మడుగ
నవని నన్నిఁటి దహియింతు ననియె నగ్ని. ౪

గీ. అప్పు డొక గడ్డిపోచను నగ్ని ముందు
యక్ష మిడి దీనిఁ గాల్పు మంచనిన నగ్ని
యదియుఁ గదలింపఁ గడ్డిని గాల్ప లేక
గర్వమును వీడి వేల్పుల కడకు మరలి
యక్షము నెఱుంగఁ జాలనం చనియెఁ గేలి. ౫

గీ. పూజ్యమై యొప్పుచుండు నీ భూత మెదియొ
యరసి రమ్మని వాయువు నంపి రంత
నాకపదగున వచ్చు వాయువును జూచి
యక్ష మెలుఁగెత్తి నీ వెవ్వఁ డనుచు నడిగె. ౬

గీ. మాతరిశ్వాఖ్యచేత విఖ్యాతుఁ డైన
వాయు వేఁ బని గర్వించి పలికె గాలి;
యయిన నీ బలి మెంతని యక్ష మడుగ
నన్నిఁటిని బట్టి కదలింతు ననియె గాలి. ౭

గీ. అప్పు డొక గడ్డి పోచను నవిలు ముందు
యక్ష మిడి దీనిఁ గదలింపు మనిన గాలి
కసుఁ గదంగియు గడ్డిని గదప లేక
గర్వమును వీడి వేల్పుల కడకు మరలి
యక్షము నెఱుఁగఁ జాలనం చనియె గాలి. ౮

గీ. పూజ్యమై యొప్పుచుండు నీ భూత మేదియొ
యరసి రమ్మని యింద్రునిఁ బంప నతఁడు
వడిగ బయ లెత్తుకొని యట వచ్చి చూడ
దృష్టి కా యక్ష మట్టె యదృశ్య మయ్యె. ౯

గీ. ఆ గగనమందె యపుడే యమర పతియుఁ
గాంతిచేఁ గ్రాలు నా హిమవంతసుతను
నుమను దర్శించి కరకములముల మ్రొక్కి
యక్ష మిది యేమి? తెలుపుమ్మ యనుచు వేఁడె. ౧౦

ఇది తృతీయ ఖండము.

సమాప్తము.

ఓ మ్.

# కేనోపనిషత్తు.

—:o:—

## చతుర్థ ఖండము.

గీ. యక్ష మిది బ్రహ్మ, మాలింపు మమరనాథ
యసురుల జయించు శక్తి యీశ కదియె యొసఁగె
ననుచుఁ బార్వతి యింద్రున కతివినయమునఁ
దెలుప బ్రహ్మ స్వరూపముఁ దెలిసె నతఁడు. ౧

గీ. అగ్నియును వాయువును మఱి నమరపతియుఁ
దొలుత బ్రహ్మ స్వరూపముఁ దెలిసి రట్లు
గానఁ దక్కిన వేల్పుల కంటె వార
లెంతయుఁ బ్రభావమున మించి యెసఁగుచుండ్రి.

గీ. వారిలోఁ దొల్త యక్షమ్ము బ్రహ్మమంచు
దేవనాథుండె యుమచేతఁ దెలిసెఁ గాన
నతఁడె మహిమను నెల్ల దేవతల మించి
వ్రాలుచున్నాఁడు విశ్వవిఖ్యాతుఁ డగుచు. 3

గీ. మెఱసి మిఱుమిట్లు గొలిపెడు మెఱవు మాడ్కిఁ
బ్రకటమై మాయునగు తెప్ప పాటు లోన
కాన బ్రహ్మ స్వరూపముఁ గాంచు టరిది
యిదియె బ్రహ్మోపదేశమై యొసఁగు వత్స. ౮

గీ. బ్రహ్మమును బొందవలె నని భావమందు
దృఢతరం బగు సంకల్ప మొసఁగువాఁడు
బ్రహ్మమునకు సమీపమై వఱలు ననుట
ప్రత్యగాత్మోపదేశమై పరఁగు వత్స. ౯

గీ. ప్రాణులకుఁ బొందఁ దగినది బ్రహ్మ మనుచు
నెంచి తద్బ్రహ్మమును నుపాసించు వాఁడు
జేరి యుండంగఁ బ్రాణులు గోరుచుంద్రు
బ్రహ్మమును జేరఁ గోరెడు పగిది వత్స.

గీ. దేవ! యుపనిష దర్థముఁ దెలుపుఁ డనుచు
నమల భక్తిని నన్నుఁ జేరి యడుగు కతన
నతి కఠినమైన యుపనిష దర్థమెల్లఁ
దెలిపినాఁడను జక్కఁగాఁ దెలియు వత్స.

గీ. బ్రహ్మమును బొంద వాంఛించు వారలకును
దపము, కర్మము, దమమును దగిన పనులు
వేద వేదాంగ సత్యముల్ విమలమయిన
బ్రహ్మ విద్యకు నెలవులై పరఁగు వత్స. ౮

గీ. బ్రహ్మ విద్యను బైఁ జెప్పఁ బడినయట్లు
తెలిసికొను వాఁడు పాపముల్ దొలఁగిపోయి
శ్రేష్ఠమై శాశ్వతంబుగఁ జెలఁగుచుండు
స్వర్గలోకాన వసియించు సతతము వత్స. ౯

ఇది చతుర్థ ఖండము.

సర్వము

స మా ప్త ము.

